

# ఫెమినిజమ్ నుంచి పాతివ్రత్యం దాకా

శ్రీమతి వేలూరి భవాని

**భా**రతదేశం స్వాతంత్ర్యం సంపాదించి ఆరు పదులు దాటింది. సుమారుగా ఏభయ్యవ దశకంలో పుట్టి ఇప్పుడు దేశంతో పాటు తాము కూడా అరవయ్యోపడిలో పడిన చాలామందిలో ఒక పునఃపరిశీలన ప్రారంభమైంది.

ప్రపంచ వ్యాప్తంగా కూడా ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా వంటి పూర్వపు వలస దేశాలలో కూడా ఇదే విధమైన భావ విప్లవాలు ప్రారంభమైనాయి. పాశ్చాత్య విద్యలో ఆరితేరిన ఈ దేశాలలోని మేధావులు స్వాతంత్ర్యానంతరం వారి వారి దేశాలలోని పరిస్థితులు రాను రాను మరింత అస్తవ్యస్తం అవడం చూసి పొరపాటు ఎక్కడుందా అని వెతకడం మొదలెడుతున్నారు.

మార్పు ఎప్పుడూ ఆలోచనల్లోంచే కదా ప్రారంభమయ్యేది? అది ప్రజాస్వామ్య వాదం కానీ, సామ్యవాదం కానీ, స్త్రీవాదం కానీ, మరేవాదం కానీ. యూరోపియన్ల వలస కాలంలో మన భారతదేశంతో పాటు అన్ని మూడో ప్రపంచ దేశాలలోను (అసలు ఈ దేశాల్ని మూడవ స్థానంలోకి నెట్టినది కూడా ఈ వలస రాజ్యాలే) వారి వారి సాంప్రదాయక వ్యవస్థలు, ఆచార వ్యవహారాలు, విద్యా విధానాలు, ఆలోచనా స్రవంతులు ఒక్క ఊపుతో కదిలించబడ్డాయి. విచిత్రం ఏమిటంటే స్వాతంత్ర్యానంతరం కూడా యూరోపియన్ విద్యా విధానంలో శిక్షణ పొంది తమకు తామే అధికులమని తలచిన మేధావి వర్గాలు ముఖ్య రంగాలలో కీలక పదవులు ఆక్రమించారు. కానీ అంతకు ముందు వేల సంవత్సరాల చరిత్ర ఉన్న దేశాలలో రెండు, మూడు వందల సంవత్సరాలు వలస రాజ్యాలు ఏ మాత్రం మార్పు సృష్టించ గలవు? ఒకవేళ సృష్టించినా ఎంతవరకు శాశ్వత ప్రభావాన్ని చూపించగలవు?



**పునరుత్పత్తి రంగం నుండి స్త్రీని క్రమక్రమంగా విడుదల చేసి ఆమె శక్తిని, సామర్థ్యాన్ని, నైపుణ్యాలను ఉత్పత్తి రంగానికి మళ్ళించడానికి పటిష్టమైన ఏర్పాట్లు జరిగాయి. దీనిలో భాగంగానే స్త్రీ శరీరాన్ని కూడా పెట్టిబడి లేని వ్యాపార వస్తువుగా పరిగణించడమనే అసహ్యకరమైన ధోరణి ప్రారంభమైంది.**




ఈ పంచారామ క్షేత్రాలు ఆంధ్రరాష్ట్రంలో మూడు జిల్లాలలో వెలసినవి. అవి - గుంటూరు జిల్లాలోని అమరావతిలోను, పశ్చిమ గోదావరి జిల్లాలోని గునుపూడి భీమవరంలో ఒకటి, పాలకొల్లులో ఒకటి, తూర్పుగోదావరి జిల్లాలోని ద్రాక్షారామంలో ఒకటి, సామర్లకోట కుమారారామ భీమేశ్వరంలో ఒకటి వెలసి భక్తుల పూజలందుకొంటున్నాయి.

ఇక ఆలయ విశేషాలు పరిశీలిస్తే శివుని లింగాకృతిలో విచిత్రమైన విభేదాలు – అమరారామంలో 36 అడుగుల ఎత్తులో 9 అడుగులు మాత్రమే దర్శిస్తాము. ద్రాక్షారామంలో 14 అడుగులు, సామర్లకోటలో 12 అడుగులు ఎత్తుగల శివ లింగం, భీమవరం, పాలకొల్లులలో రెండడుగుల ఎత్తు ప్రమాణం గల శివ లింగం దర్శిస్తాము.

అమరారామంలో బాలరాముండేశ్వరి సహిత అమరేశ్వరస్వామిగాను, ద్రాక్షారామంలో మాణిక్యాంబ సహిత భీమేశ్వరునిగాను, కుమారారామంలో బాలాత్రిపుర సుందరి సమేత సోమేశ్వరునిగాను, సోమారామంలో పార్వతి, అన్నపూర్ణ సమేత సోమేశ్వరునిగానూ, క్షీరారామంలో పార్వతి సహిత శ్రీరామ లింగేశ్వరునిగాను పూజింపబడుతున్నారు.

ఈ పంచారామ క్షేత్రాలైదింటిలోను ద్రాక్షారామానికి ప్రత్యేక విశిష్టత కలదు. ఇక్కడి అమ్మవారు మాణిక్యాంబదేవి అష్టాదశపీఠాలలో 12వ శక్తిపీఠంగాను, భీమేశ్వర స్వామి ద్వాదశ జ్యోతిర్లింగ ఉపలింగంగాను ప్రసిద్ధి చెందినవి.

రవి అస్తమించని సామ్రాజ్యాలుగా చాటుకున్న వలస ప్రభువుల నిష్క్రమణానంతరం రెండు, మూడు దశాబ్దాలలో ఈ నూతన దేశాలలో అసలైన జ్ఞాన సూర్యోదయం కలిగింది. దిగుమతి చేయబడిన వ్యవస్థలు, భావజాలాలు ఎంత ప్రయత్నించినా సఫలీకృతం కావటం లేదు సరికదా సరికొత్త సమస్యల్ని సృష్టించి మనం పురోగమిస్తున్నామా లేక తిరోగమిస్తున్నామా? అనే అనుమానాల్ని సృష్టించాయి.

అగ్రరాజ్యాల పేరుతో క్రొత్తరకం పెత్తందారీ విధానాన్ని ప్రవేశపెడుతున్న వ్యవహారం క్రమక్రమంగా చిత్తశుద్ధి కల మేధావులను మరింత ఆలోచింపచేసింది. ఇదే నేపథ్యంలో సామ్యవాదం, స్త్రీవాదం లాంటి భావజాలాల్లో కూడా ఒక పునఃపరిశీలన ప్రారంభమైంది.

ఆయా దేశాలలో స్వాతంత్ర్య సమరాలతో ప్రత్యక్ష సంబంధం లేని యువతరాలు సంప్రదాయ భావాలకు, నూతన వ్యవస్థలకు మధ్య జరిగే నిరంతర సంఘర్షణకు బలైపోతున్నారు. ఎటు వెళ్ళాలో తెలియక, అవగాహన లేమితో కూడిన తల్లిదండ్రుల పెంపకం వలన దిశానిర్దేశం చేసే సరియైన గురువులు దొరకక కొన్ని కొన్ని సందర్భాలలో వ్యసనాలకు లోబడడం, అసాంఘిక శక్తుల బారిన పడడం చూస్తున్నాం.

మనదేశంలో స్త్రీల స్థితిగతుల విషయానికొస్తే శ్రుతులు, స్మృతులు, పురాణాలు, రామాయణ, భారతాది ఇతిహాసాలు, మనుధర్మ శాస్త్రం వంటి గ్రంథాలు ప్రామాణికమని అందరి విశ్వాసం. సనాతనమైన ఈ ధర్మంలో చరిత్ర సృష్టించిన మలుపులు ఎన్ని ఉన్నప్పటికినీ స్త్రీ, పురుష సంబంధాలు, కుటుంబ వ్యవస్థ, ఆచార వ్యవహారాలు మొదలైన వాటన్నింటిలో అంతర్లీనంగా దాగివుండి ఈనాటికీ కొనసాగుతున్న భారతీయ విలువలు ప్రస్ఫుటంగా గుర్తించవచ్చు.

మన ధర్మంలో పురుష శబ్దం స్త్రీ పురుషులిరువురినీ సూచిస్తుంది. వివాహాన్ని ఒక పవిత్రమైన శాశ్వతబంధంగా గుర్తించడం, అర్ధనారీశ్వరతత్త్వం, సంతానోత్పత్తిని భౌతికానందం కోసం కాక వంశోద్ధరణ కోసం చేసే ధర్మకార్యంగా గుర్తించడం, ధర్మ, అర్థ, కామ, మోక్షాలు అనే చతుర్విధ పురుషార్థాలకు కట్టుబడి జీవించడం అనేవి భారతీయ ధర్మంలో ప్రధాన సూత్రాలు. వీటిని ఆధారంగా చేసుకొని ఆయా సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలు వ్యవస్థీకరించబడ్డాయి.

ఈ ప్రవాహ రూపమైన సంస్కృతిలో అలజడి సృష్టించినది బ్రిటిష్ వలసపాలన అని చెప్పక తప్పదు. ఐరోపా దేశపు సాంస్కృతిక నేపథ్యం తప్ప స్త్రీల స్థితిగతులను సానుకూలంగా అవగాహన చేసుకోవడంలో గానీ, స్పందించడంలో గానీ వలస పాలకులకి ఏ మాత్రమూ విశ్వజనీన సూత్రాలు లేవు. అయితే ఏమిటి ఆ ఐరోపా సంస్కృతి? దీనిని గూర్చి కొంచెం లోతుగా పరిశీలించవలసి ఉంది.

మనలాగా శ్రుతులు, స్మృతులు లేకపోయినా గ్రీకు నాగరికతతో ప్రారంభమై ఆధునిక కాలం దాకా ప్రాచుర్యంలోకి వచ్చిన ఐరోపా హృదయాన్ని ఆవిష్కరించే గ్రంథాలు ఎన్నో లభిస్తున్నాయి. మన దేశంలో లాగా తపశ్శక్తితో సంపాదించిన జ్ఞానం కాకపోయినా కొంత పదార్థవాదం, కొంత తాత్త్విక చింతన మిళితం చేస్తూ ప్రాథమిక భావజాలాన్ని సృష్టించిన గ్రంథకర్తలూ ఉన్నారు. హోమర్ వంటి

కవులు, సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్, హెగెల్, రూసో, మార్క్స్, ఫ్రాయిడ్ వంటి తత్త్వవేత్తలు నాటికీ, నేటికీ యూరప్ భావ సంస్కృతికి సృష్టికర్తలుగా గుర్తించబడుతున్నారు. స్త్రీ, పురుష సంబంధాల గురించి వీరందరి రచనల్లో అంతర్లీనంగా ఉన్న భావ పరంపరను మనం గుర్తించవచ్చు.

ఉదాహరణకి ప్రపంచంలోని ద్వంద్వాలనన్నింటినీ గుర్తిస్తూ వాటిలో స్త్రీ, పురుషుల్ని కూడా చేర్చడం జరిగింది. అంతేకాదు ఈ ద్వంద్వాల మధ్య సహజమైన అసమానతలకు అధిక ప్రాధాన్యత ఇస్తూ, ఒకదానికి, మరొకదానికి ఉన్న వైవిధ్యాన్ని వైరుధ్యంగా చిత్రీకరించడం జరిగింది. ఈ విషయాన్ని ఈ క్రింది పట్టిక తేటతెల్లం చేస్తుంది.

| | | |
|---|---|---|
| మానసిక(Mental) | - | శారీరక (Physical) |
| బహిరంగ (Public) | - | వ్యక్తిగత (Private) |
| (Subject) | - | (Object) |
| హేతుబద్ధత (Reason) | - | భావోద్వేగం (Passion) |
| సంస్కృతి (Culture) | - | ప్రకృతి (Nature) |
| అధికారం (Power) | - | స్వేచ్ఛ (Freedom) |
| విశ్వవ్యాప్తం (Universal) | - | పరిమితం (Particular) |
| ఉత్పత్తి (Production) | - | పునరుత్పత్తి (Re Production) |
| పురుషుడు (Male) | - | స్త్రీ (Female) |
| మంచి (Good) | - | చెడు (Bad) |

పై పట్టికను క్షుణ్ణంగా పరిశీలిస్తే కొన్ని అసంబద్ధతలు గోచరిస్తున్నాయి. చివరి రెండు అంశాలను మినహాయించి పై వాటిని పరిశీలిస్తే అవి తత్త్వాలకు సంబంధించినవి. మానసిక విషయాలకు ప్రాధాన్యత ఇవ్వడం, శారీరక సుఖాలకు వెంపర్లాడడం లేదా హేతుబద్ధంగా ఆలోచించడం లేదా భావోద్వేగాలకు లోనుకావడం - ఇలాంటివన్నీ మానవ లక్షణాలు.

ఈ వర్గీకరణను చివరిగా తెచ్చి అసంబద్ధంగా వాటికి స్త్రీ, పురుష అనే శారీరక పరిమితులు విధించడం ఎంత వరకు సమంజసం? పైగా అక్కడితో ఆగకుండా కొస మెరుపులా పట్టికలో ఒక నిలువ వరుసనంతా మంచిగాను, రెండవదాన్ని చెడుగాను చూపించడం ఎంతవరకు సబబు?

క్రీస్తుపూర్వం ఏడవ శతాబ్దిలో గ్రీకు నగర రాజ్యాల ప్రారంభానికి ముందే కుటుంబ వ్యవస్థకు ప్రతికూలమైన భావ వాతావరణం ఏర్పడింది.

ప్రకృతికి చేరువగా అతి సాధారణమైన, సహజమైన జీవన విధానానికి ప్రతికూలంగా పోటీకి, రాజకీయ బలానికి ప్రాధాన్యమిచ్చి నగర రాజ్యాలు అవతరించాయి. ప్రముఖ గ్రీకు తత్త్వవేత్తగా చెప్పబడే ప్లేటో మహాశయుడు భార్యల కమ్యూనిజమ్ అనే భావాన్ని ప్రాచుర్యం చేశాడు. అక్కడ వేయబడింది స్త్రీల అణచివేతకు పునాది. తరువాత యూరప్‌లో వచ్చిన పలు తాత్త్విక సిద్ధాంతాలలో నాగరికత పెరగటం అంటే ప్రకృతి మీద, స్త్రీల మీద పురుషులకు ఆధిపత్యం పెరగడం అనే భావన ప్రస్ఫుటంగా కన్పిస్తుంది.

పదార్థవాదం ప్రకృతిని శాస్త్ర, సాంకేతిక రంగాల పేరుతో ధ్వంసం చేయడం, ప్రతి విలువైన వస్తువుని వ్యాపారాంశంగా మార్చడం అనే పాశ్చాత్య ఆధునిక భావజాలానికి బీజాలు పడ్డాయి.

ఉత్పత్తిని, పునరుత్పత్తిని నియంత్రించడం అనేది వాస్తవంలో ప్రకృతిని, స్త్రీ జీవితాన్ని నియంత్రించడంగా పరిణమించింది.

ఇంకా క్లుప్తంగా చెప్పాలంటే పునరుత్పత్తి రంగం నుండి స్త్రీని క్రమక్రమంగా విడుదల చేసి ఆమె శక్తిని, సామర్థ్యాన్ని, నైపుణ్యాలను ఉత్పత్తి రంగానికి మళ్ళించడానికి పటిష్టమైన ఏర్పాట్లు జరిగాయి. దీనిలో భాగంగానే స్త్రీ శరీరాన్ని కూడా పెట్టుబడి లేని వ్యాపార వస్తువుగా పరిగణించడమనే అసహ్యకరమైన ధోరణి ప్రారంభమైంది.

గర్భధారణ కానీ, పిల్లల పెంపకం కానీ, వారిని విద్యావంతుల్ని చేయడం గానీ, వారి ఉత్పత్తి, ప్రవృత్తిని మలచడంలో గానీ, స్త్రీకి కుటుంబానికి ప్రాధాన్యతను తగ్గించివేస్తూ ప్రభుత్వ సంస్థల, ప్రైవేటు సంస్థల చేతుల్లోకి ఈ ప్రక్రియను తరలించే ధోరణి మొదలైంది. కమ్యూనిస్టుల ఆగమనంతో ఇది పరాకాష్ఠకు చేరింది.

కారల్ మార్క్స్ సహ రచయిత అయిన ఏంగెల్స్ సాంప్రదాయిక సంస్కృతులపై సాధించిన విజయాన్ని "The World Historical defeat of the female Sex"గా వర్ణించారు.

మాతృస్వామిక ఆచారాలను తుడిచిపెట్టి పితృస్వామిక సమాజాలను స్థాపించడం అనేది నాగరికతలో ఒక విజయవంతమైన చారిత్రాత్మకమైన ఘట్టంగా యూరోపియన్లు అభిప్రాయపడ్డారు. స్త్రీ, పురుషుల మధ్య వైరుధ్యాలు సృష్టించడం నాణానికి ఒక ప్రక్క అయితే, నాగరికత పేరుతో సమాజాన్నంతటినీ పురుష సంస్కృతి లోనికి మార్చివేయడం రెండో ప్రక్క.

"Why can't a woman be more like a Man" అనే ప్రసిద్ధమైన ఆంగ్ల పాట చాలా మందికి తెలిసే ఉంటుంది. వ్యవహారంలో దీనికర్థం ఏమిటంటే వస్త్రధారణలో గానీ, భావోద్వేగాలను అణచుకోవడంలో గానీ, హేతుబద్ధంగా వ్యవహరించడంలో గానీ, స్త్రీలు పురుషుల్లాగా ఎందుకుండరు? ఎంతసేపు పిల్లలు, వంటలు, వార్పులు, కుట్లులు, అల్లికలు, మతాలు, ఆచారాలు అంటూ కాలాన్ని స్త్రీలు ఎందుకు వ్యర్థం చేస్తారు? కుటుంబం అనే ఉచ్చులో చిక్కుకుని బయటి ప్రపంచపు ఆనందాల్ని ఎందుకు కోల్పోతారు? ఇలాంటి భావ పరంపరతో ప్రారంభమై కుటుంబం-కుటుంబేతర ప్రపంచం, స్త్రీలు - పురుషులు అనే అంశాలు ఎప్పటికీ సమన్వయం కుదరని వైవిధ్యాంశాలుగా సిద్ధాంతీకరించబడ్డాయి.